Reg. No. 757

# అభినవసరస్వతి

యిదియొక మాసపత్రిక

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథ[illegible]




జనపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపబడుచున్నది

జనపాడు

సంపుటము 19 { 1928 సం॥ ఫిబ్రవరి నెల } సంచిక 11

## విషయములు

౧ ఆహ్వానపత్రిక.

౨ విదూషకోపన్యాసము.

3 నాగరఖండము - సంపాదకుడు

చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc, etc

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, నారాయణపేట.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, దుబ్బాక.
౩ వాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రాజసింగుగారు- నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, విశాఖపట్టణంజిల్లా
౨ ఎనమంద్ర లక్ష్మినరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావు గార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మినర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖు గారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౦ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౧ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౨ టేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౪ పిసుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, పాకాల.
౧౬ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకోండూరు
౧౭ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౮ లింగాల రంగారెడ్డి దేశముఖు, గణపురం,

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౩ కుంటుపల్లి రామారావుగారు, సంగెం.
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాకోరుపల్లె

## చందాదారులు.

౧ శిష్ట్లా వెంకటకృష్ణయ్యగారు ప్లీడరు బెజవాడ

౨ యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారు కారంచేడు

౩ పూటుకూరు కో॥ వెంకటేశ్వరులుగారు మర్చెంటు చీరాల

౪ కురుగంటి వెంకటరమణయ్యగారు వంగోలు

౫ భాగవతుల సూర్యనారాయణగారు కొల్లూరు

౬ నైషధం వెంకటేశ్వరావధానులుగారు కొల్లూరు

౭ గడియారం వెంకటశివశాస్త్రిగారు సంగాజాగర్లమూడి

౮ తిరుకోవళ్ళూరి చక్రపాణిగారు డిప్టీ లెక్టరాఫీసు నర్సారావుపేట

౯ చివుకుల వెంకటశాస్త్రిగారు దేవస్థానంఆఫీసు తిరుపతి

౧౦ పట్టాభిరామస్వామిశాస్త్రిలుగారు భాస్కరాచార్యులు బళ్లారి

౧౧ కంచిరాజు లక్ష్మీనరసింహంగారు వకీలుగుమాస్తా కడప

౧౨ గుండెపూడి విశ్వనాధం నరసింహంగార్లు సత్తెనపల్లి

౧౩ వేలేటి రాఘవశాస్త్రిగారు

౧౪ వ్యాకరణం వెంకటేశ్వరులుగారు తాళ్ళూరు

౧౫ శ్రీగిరిరాజు లక్ష్మీనరసింహంగారు తాళ్ళూరు

౧౬ భువనగిరి కోదండపాణిగారు సబిజిస్ట్రారు కోసూరు

౧౭ బెల్లంకొండ హనుమంతరావుగారు పమిడిపాడు

౧౮ వెంకట రామయ్యగారు గ్రంధిసిరి

౧౯ పెండ్యాల యజ్ఞనారాయణగారు గుమ్సమేష్టరు కంభంమెట్టు

౨౦ అడ్లూరు రఘురామయ్యగారు ఇల్లింద

౨౧ హిమకుంతలం వెంకటనరసింహంగారు అలవాల

౨౨ రాజరాజనరేంద్రాంధ్రభాషానిలయము. హనుమకొండ

౨౩ నెల్లుట్ల వెంకటపాపయ్యదొరవారు బమ్మెర

౨౪ మొసలి పాపిరెడ్డిగారు కొమ్మెపల్లి

౨౫ పాటిబండ సూర్యనారాయణరావుగారు ప్లీడరు గుంటూరు

౨౬ ఆగం రెడ్డిగారు నాగిరెడ్డిపల్లె

౨౭ సుద్దాల లక్ష్మారావుగారు బొందుగుల

౨౮ సింగీతం అమృతరావుగారు మక్తేదారు కొన్నె

౨౯ గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు ఇటికాలపల్లె

౩౦ ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆప్కారీనాయకుడు జనగాం
౩౧ యువజనసంఘము జనగాం
౩౨ బాకరాజు రాజేశ్వరరావు దేశముఖుగారు దుండిగల్లు.
౩౩ ఇంద్రకంటి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు కర్నూలు
౩౪ ఇంగువ వెంకట సీతారామయ్యగారు ఇందుకూరుపేట
౩౫ మైలవరం కృష్ణమూర్తిగారు కంట్రాక్టరు ఏలూరు
౩౬ మొలుగు రామయ్యగారు మసీదుపల్లి
౩౭ వకీలు శంకరరావుగారు మాచాయపేట
౩౮ బిదరు కృష్ణయ్యగారు తూపరాణి
౩౯ సోమవరపు బసవేశ్వరరావుగారు తా॥ గుమాస్తా మానుకోట
౪౦ గోవిందరాజు మాధవరావుగారు తాలూకాగుమాస్తా సిద్దిపేట
౪౧ వాదరగుల్ సంగమేశ్వరరావుగారు
౪౨ చతుర్వేదుల ధర్మారావుగారు హైదరాబాద
౪౩ గూడ అనంతరామయ్యగారు చుక్కాపురం
౪౪ సీతారామారావుగారు తేరుపల్లి
౪౫ లక్ష్మణరావుగారు మల్లెపల్లి
౪౬ గోవిందరావుగారు అల్లాదుర్గం
౪౭ కోరి నరసింగరావుగారు మంతులూరు
౪౮ ధోరి అనంతాచార్యులుగారు అల్లాదుర్గం
౪౯ కందాళం కేశవాచార్యులుగారు కిచ్చన్నపల్లి
౫౦ మల్లావఝ్ఝల రాజగోపాలంగారు భువనగిరి
౫౧ లంకా అంబయ్యశాస్త్రిగారు అంబాపురం
౫౨ మంత్రిప్రెగడ భుజంగరావుబహదరుజమీందారుగారు ఏలూరు
౫౩ శ్రీగిరిరాజు రాఘవయ్యగారు గుండ్లపల్లి
౫౪ భువనగిరి ముకుందరామయ్యగారు హెడ్కలెక్టరాఫీసుక్లార్కు
౫౫ మక్కపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అనమనమూరు (గుంటూరు
౫౬ పుచ్చా పట్టాభిరామయ్యగారు తుమ్మలచెరువు
౫౭ జింకా సుబ్బారావుగారు జిల్లాకోర్టువకీలు గురిజాల
౫౮ వసిష్ఠ వేదాధ్యయనపాఠశాల అమరావతి
౫౯ దండెంరాజు లక్ష్మీనరసింహంగారు పిడుగురాళ్ల
౬౦ పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు గుంటూరు

# అభినవసరస్వతి

సంపుటము ౧౯ { జానపాడు / ప్రభవ సం॥ మాఘమాసము } సంచిక ౧౧

## ఆహ్వానము.

శ్లో॥ అఖిలవిదవిదీశ శ్శ్రీనివాసో దయాళు
స్స్వపదకమలయుగ్మప్రాపక స్సంశ్రితానాం
నిగమశిఖరగమ్యో నిత్య మవ్యాజబంధు
ర్విలసతు మమ చిత్తే వెంకటేశో ముకుందః ॥

భక్తాగ్రేసరులారా? ఏతన్మహీమండల మండనాయమానంబగు జగదంతవిశ్రాంతదిగంత కీర్తియగు శ్రీమద్భాగ్యనగరంబునకు వాయవ్యదిశయందు మెదకుజిల్లాలోచేరిన అందోలుతాలూకా గ్రామంబునకత్యంత సమీపమయియుండిన పరంపరాపారావారలక్ష్మీవిభవపూరితంబైన కిచన్నపల్లియగ్రహారంబైన పశ్చిమతిరుమలయను ఆర్యులచే నియమింపఁబడినదివ్యస్థలమునందు శ్రీలక్ష్మీఅలమేలుమంగాసమేతులైన వెంకటరమణస్వామివారికిఁ బ్రతిసంవత్సరంబున నపరిమిత వైభవంబుతో జరుగఁబోవు బ్రహ్మోత్సవ వివరము.

యీ ప్రభవ సం॥ ఫాల్గున శు ౮ శుక్రవారం చ ౬ ఆర్ద్రా బెహస్తు
రాత్రి ఘంటలకు అంకురార్పణ పుట్టబంగారుసేవ.

... ౯ శనివారం చ ౭ పగలు ఘం॥౧౦ కి ధ్వజారోహణ సాయం
త్రీకి భేరీపూజా రా॥ ఘం ౯ కి గజవాహనసేవ.

... ౧౦ ఆదివారం చ ౮ ప॥ ఘం ౧౨ కి తిరుక్కల్యాణం
సింహవాహనసేవ రా॥ ఘం ౧౦ కి హనుమంతవాహనసేవ.

... ౧౧ సోమవారం చ ౬ ఉదయం గరుడసేవ రా॥ ఘం ౯కి పొన్నవాహనసేవ అతిరమ్యమై తోచును సేవించ తగినది.

... ౧౨ మంగళవారం చ ౧౦ ఘ॥ రథప్రతిష్ఠాపనం ౩ కి శకటభ్రమణము రా॥ ఘ॥ ౧౧ రథోత్సవము బహురమ్యముగా జరుగును.

... ౧౩ బుధవారం చ ౧౧ క॥ఘ॥ ౯కి చక్రవారి రా॥ దోపు

... గురువారం చ ౧౨ ఉదయం శ్రీపుష్పయాగం రా॥ ఏకాంతోత్సవం లక్ష్మీసమేతులై చూడతగినది.

ఏతదుత్సవమునకు నటవిటగాయకులు మున్నగు విశేషవాద్యములతో విశేషవైభవముగా జరుగును. సుజనులారా! తమ తమ పుత్రమిత్రకళత్రాదులతో వచ్చేసి స్వామివారి యుత్సవము సేవించి స్వీకృత తీర్థప్రసాదులై ఆనందసాగరమగ్నులై స్వామికైంకర్యాభివృద్ధి గోరెదరు గాక యని ప్రార్థన.

| | |
|---|---|
| ఇట్లు దేవస్థానాధికారులు, | ఇట్లు కార్యదర్శి, |
| శ్రీ కం॥ అనంతాచార్యులవారు. | కం॥ కేశవాచార్యులవారు. |

☞ వచ్చేవారలకు శంకరపల్లిస్టేషన్ దిగి జోగిపేట మోటరుపైన కిచ్చన్నపల్లి వరకు సౌకర్యముగా రావచ్చును.



# విదూషకోపన్యాసము.

నాయనలారా! రొంపభారమువలనఁ జదువఁజాలక క్రిందటి సారి వదలివేసిన కలల కామరాజుగారి వ్యాసమందలి శేష మీదినమునఁ జదువఁ దలంచితిని. మీరు వినదలంచినను సంతోషమె; వినదలంపక వెడలిపోఁదలంచినను సంతోషమె.

---

## లక్ష్మీబాయిగారి యుపన్యాసము.

సోదరీమణులారా! అక్కఱకొలఁది మనమందఱు మీతావున నంట సిల్లుచు, అననుకూలమున నంతరాయములు గలుగకుండు నట్టు లంతరువు లెఱుంగుచు, అనుకూలముతో నంతరములఁ దెలిసికొనుచు, అంతర్యాతముల నంతర్ధాన మొనరించుచు, అన్వయముతో, అపేక్షతో, అభివృద్ధితో, అఖిలమహిళా జనసభను జయప్రదముగా ప్రతి వత్సరాంతమునను జరుపుచు, స్త్రీల కుపయోగకరములైన విషయములను దెలిసికొనుచు, ఆయావిషయములం దుండెడి మంచిచెడుగులను తర్కించి యిదమిద్ధమని సిద్ధాంతరీకరించిన తీర్పులను ప్రభుత్వము వారి వలన చట్టములుగా మార్పించుచు నీయిరువది వత్సరములనుండి మనము చేసిన కార్యక్రమ మద్వితీయము అనంతవిజయము.

నేటికి మనసోదరీమణులు పురుషుల కొదిఁగిమదిగి వంటయిల్లు జొచ్చి వంటకముఁ జేయుట మాని రాచకార్యముల నిర్వర్తింప రాజకీయ కక్షలన్నిటియం దుద్యోగముల స్వీకరించి కీర్తినొందుచున్నారు. వివిధవర్ణ పుష్పమాలిక లల్లుట విడచి కల్పనా చమత్కృతితో, భావగాంభీర్యముతో, శబ్దగుంఫనముతో, శయ్యామార్దవముతో, నవరసంబులొలుక ననేక గ్రంధములల్లి, ప్రపంచమున వెదజల్లి, కవితామతల్లులనిపించుకొనుచున్నారు. నిత్యగృహకృత్య నిర్వాహణమునకుఁ బురుషులను నియోగించి శాసనసభలో సభ్యురాండ్రై రాజ్య చక్రముఁ ద్రిప్పుచున్నారు. (సెబాస్, సెబాస్ అని సభలో కేకలు)

పురుషుల హక్కులన్నియుఁ దొలఁగింపఁ దీర్మానములఁ దెచ్చి శాసన సభలోఁ బ్రవేశపెట్టి చట్టములుగా నామోదింపఁ జేయుచు మనము విజయముఁ గాంచుచుండ తెల్లమోములతో వెల్లిచూపులతో పురుషులు మనలను జూచుదినములు ప్రాప్తించినవి. ఇన్ని సంవత్సరములకు వారి యహంభావత్వము—వారి ప్రభ—వారి యాధిక్యము—వారి తెలివి తేటలు—వారి గర్వము లడంగినవి, అస్తమించినవి, అనుపయోగములైనవి. ఈవత్సరమున శాసనసభలో స్త్రీలు తొమ్మండ్రుగురును పురుషులు ముప్వురును సభ్యులుగా నియమింపఁబడిరి గాన నీ సమయమును బోఁగొట్టుకొనక స్త్రీజాతికి పురుషజాతి దాసులుగా నుండునట్లు చట్టములు సృష్టించ కృషిసల్పుఁడు. వంగినప్పుడే వంచుటకు వీలగును. .........(సభలో గాజుల గలగలలతో కాంతామణుల కరతాళ ధ్వనులు) తమవలననే జగమునంగల ప్రాణికోటులెల్ల సృష్టింపఁబడుచుండెననియు తామె సృష్టికారకులమనియు దైవాధికారమును దమపై వైచుకొనిన మగపురుగులు స్త్రీలు లేనియెడల సృష్టి జరుగదని తాము పొందిన యున్నతస్థితిలో గొంతభాగమైన మన కిచ్చినారా? ఈయఁదగునా? లేదా? అనియైన విచారించినారా? ఇయ్యలేదు. పోనీ! అంతటితోనైన యూరకుండెనా? లేనియాధిపత్యమును దెచ్చిపెట్టుకొని పురుషులకు స్త్రీలు భోగ్యవస్తువులనియు, కామతంత్రమును నిర్వర్తించుకొను తోలుతిత్తులనియు, సేవకురాండ్రనియు, భావించి కుక్కలకన్న నతినీచముగాఁ జూచినారే! మనము మనుష్యకోటిలోని వారమా కామా? అనియైన వితర్కించుకొనిరా? వితర్కించుకొనలేదు. సరే! ఇహపరసాధకమైన విద్య తమకు జ్ఞానోపదేశమనియు, మనకు దుష్ప్రవర్తన సాధకమనియు, సిగ్గువిడచి మాట్లాడుటయేగాక తాము సకల శాస్త్రకోవిదులైనను మన కక్షరజ్ఞానమయిన కలుగునటులఁ జేసినారా? నేర్పుటకైనఁ గడంగఁదలంచినారా? అంతటితో నూరకుండెనా? మనకు వంటయిల్లే పాఠశాలయనియు, బూరెలమూకుడె కాగితమనియు, గరిఁటె కాఁడయె కలమనియు, నూనెయె సిరాయనియు, కలియుబెట్టుటె లేఖనమనియు, వేఁగిన మిరెపకాయలె యక్షరములనియు, పచ్చడిచేయుటయె ప్రకృతి శాస్త్రపఠనమనియు, వంటజేయుటయె

గ్రంథరసగ్రహణమనియు, గృహకృత్యముల నిర్వర్తించుటకు కవిత్వ మల్లుటయనియు, ఇంకొకటిఁ జేయుట వేఱొకటియనియు, వేఱొకటిఁ జేయుట మఱొక్కటియనియు, తలతోఁబాటు కన్నులను చేతులను ద్రిప్పుకొనుచు సకల జనసమక్షమున స్త్రీవిద్య దూష్యమని సిగ్గులేక సభలో నుపన్యసించినారే! అంతటితో నూరకుండిరా? ఫచాటుననో యెత్తువైచి యెనసి మనలో మనము నేర్చుకొనువిద్యను గాంచినయెడల వారి కన్నులు చిటచిటలాడి పగిలిపోయెడివే— తలలు తిరిగిపోయెడివే— తనువులు దగ్ధమయ్యెడివే — నలుబది వత్సరముల క్రిందట మన కవిత్వము మతాటియాకుల మాటయనియు, తాలింపులేని కూరయనియు, తప్పుటిత్రొట్టెయనియు నింక నేమో యని తలతిరుగుడు మాటల నెన్నిటినో సభలలోఁ బలికినారు గదా. ఇప్పుడట్టిపలుకులను మనవద్ద బలికిననో నూరకుందుమా? జుట్టుపిలక సాగఁదీసి చేతులకుఁ జుట్టుకొని పండ్లూడునటుల దౌడలపైఁ గొట్టుమా? ఇఁక నెప్పుడట్లు వెఱ్ఱిమొఱ్ఱిగా వాగకుండునటుల వాగ్బంధనముఁ జేయ నోటీసులఁ బంపమా? సంకెలలు వేయుమా? మన కవిత్వమును జూచి యెగలించి యెన్నివిధములుగనో యాక్షేపించిన వారి కవిత్వమెట్టిదో విద్యావంతురాండ్రగు మనసోదరీమణు లిపుడైన నెఱుంగరా? ఇప్పటికైన వారి కవిత్వపు ఘనత బట్టబయలగుచుండుటలేదా? వారు కవులనియు, ఘనులనియు, వారికవిత్వ మతిరుచ్యమనియు, స్వభావోక్తులతోఁ గడు సొంపుగా నుండుననియు విద్య నేరువకమునుపు, కవిత్వమల్లుట తెలియనప్పుడు, ప్రారంభదశయం దజ్ఞానముచే ననుకొనిన మనమిప్పు డీమాసాలకవులలో నూటికి, తొంబదిమందికన్న నెక్కువగా శుద్ధశుంఠలు, నీతిబాహ్యులు, దుండగీఁడులుండిరనుకొనుచుండుటలేదా? కవిత్వమును యనురాగవతియగు యాఁడది చెప్పవలయును. గాని కఠిన హృదయులగు పురుషు లేమి చెప్పఁగలరు? అధిక లావణ్యాతిశయములుగల యాఁడది చెప్పవలయునుగాని మోటమొఱకుజాతియగు పురుషు లేమి చెప్పగలరు? అగాధహృదయముగల యాఁడది చెప్పవలయునుగాని తేలికమనసుగల పురుషు లేమిచెప్పఁగలరు? చెప్పినను విని సంతోషించువారెవరు? వారి వెక్కిరింపులు—వారి వక్రవర్తనములు—

వారి వాచాలతలడంగి, కాలము మన యాధీనమైనది. ఎన్నితరముల నుండియో మన ముపయోగించుకొను గరిటెకాడలు వారి హస్తగతములై కలము కాగితములు మనహస్తముల నలంకరించినవి. మనజాతికి సుదినములు ప్రాప్తించినవి. శాసనసభలో మీారీసంవత్సరమున చట్టములుగా మార్పింపఁ గృషిసలుపవలసిన తీరుపులను నాకుఁ దోచిన కొలఁది వివరించెదను. సహృదయులగు నా సోదరీమణు లందలి గుణాగుణములను విమర్శించెదరుగాత !

1. ఇదివరకు స్త్రీల నబలలనెడి వాడికనామమును తప్పించి యింతటినుండి స్త్రీలను సురూపులనియుఁ బురుషులను కురూపులనియుఁ బిలువవలెను.

2. ఈవత్సరము మొదలు పదిసంవత్సరములవఱకు పురుషులకు ప్రభుత్వమువారి శాఖలోను యుద్యోగముల నీయరాదు.

3. ఇంతటినుండి పాఠశాలలో విద్య నేర్చుకొనుటకు పురుషులను జేర్చుకొనఁగూడదు.

4. ఇంతటినుండి జరుగఁబోవు శాసనసభలకు పురుషులను ప్రతినిధులుగా నెన్నుకొనఁజనదు.

5. పురుషులకు స్త్రీ లొడిఁగిమడిగి యుండవలయునని వ్రాయఁబడిన పుస్తకముల నన్నింటినిఁ దగులఁబెట్టవలయును.

మీారీవత్సరమున నీయైదు తీర్మానములను చట్టములుగా మార్పించినచోఁ బూర్వాచారములన్నియుఁ దలక్రిందై, సృష్టికి మేమే కారకులమని విఱ్ఱవీగిన పురుషులు, మీావల్లనే సృష్టి నిలచెనని మనలనుజూచి పలుకుదురు. పలికితీరుదురు. అప్పటికిగాని వారి క్రొవ్వణంగి వారు మనకుఁజేసిన ద్రోహఫల మనుభవింపరు. సోదరీమణులారా! నేర్చియో నేరకయో నుడివిన నాపలుకులను బాటించి నేను జెప్పిన విషయములను చర్చింపుఁడు. చాల తడవాయెను. కార్యక్రమ మనుసరించి పంచమవివాహముఁ జేసుకొని పదుగురు బిడ్డలఁగన్న పార్వతమ్మగా రుపన్యసింతురు. అనియాపె యాగద్దియపైనుండి దిగెను. అనసూయాదేవిగారు లక్ష్మిబాయిగారి తీర్మానములను బలపరుప సభ్యులందఱేకగ్రీవముగ నామోదించిరి. అనంతర మొక లేమ

తాను ధరించిన తెల్లనిగౌనుకాంతు లెల్లెడఁ బ్రకాశింప కాళ్ళజోడు టక్కు టక్కుమన కాంతామణుల కరతాళధ్వనులతో నుపన్యాసరంగ మధిష్ఠించెను.

---

## పార్వతమ్మగారి యుపన్యాసము.

సోదరీమణులారా! మొదటినుండియు మనపచ్చ, పురుషులకుఁ గిట్టదు. ఎల్లకాలము తమసుఖము, తమవృద్ధి, తమ యారోగ్యమును జూచుకొను దుర్మార్గులు, దురాచారులు, దుష్కర్ములు—ముగ్గుబుట్టల వలె నెఱసిన తలలతో, చొల్లుగారెడి నోళ్ళతో, ముడుతలుపడిన శరీరములతోఁ జేతికఱ్ఱలను నేలఁదాటించుకొనుచు మనుమలు దారిచూప మారుమనువులకు సిద్ధపడుదురేగాని, కామసుఖ మెఱుంగని బాలవితంతువులకుఁ బునర్వివాహములు కూడవని జెప్పినారే! మనయెడల వారికి దయాదాక్షిణ్యము లుండినవా? న్యాయైకబుద్ధి యుండెనా? తామొనర్చెడి తప్పుడుతిరుగుడులు, గోడదాటులు, భగవంతునికిఁ బ్రీతికరములా? న్యాయశాస్త్రసమ్మతములా? సుకార్యములా? మగని మొగమైన నెఱుంగని బాలవితంతువులకుఁ బునర్వివాహము లొనర్చుట దుష్కార్యములా? అనర్థములా?—వారుకూసెడి వంకరకూతలు, అనృతవాక్కులు, వేదాక్షరములా? శిలాక్షరములా? ఒండొరుల సౌఖ్యముకొఱకై వృద్ధికొఱకై దైవము స్త్రీ పురుషులను సృజింపలేదా? అతనికిగూడ హృదయము లేదా? అతని ముఖంబున వెలువడినవను వేదములుకూడ మన కధోగతి గల్పించునవేనా? ఔరా! మగవారి మనస్సులప్రకారము పలుకుల వెంబడిని, నడతతీరున స్త్రీలు తమ జీవితములను ధారపోసి వారి యాజ్ఞానువర్తులై యుండవలయుననియే గదా పూర్వకాలపు ఘనత, పాతదినముల పాడుపోడిమి, పనికిమాలిన యుగమర్యాద. వారి యాజ్ఞానువర్తులమై వారికి విధేయులమై, వారిని పూజించుచు వారు మనల నేమిచేసినను నోరుమూసుకొని పడియుండుటకు మనకు మానాభిమానములు లేవని తలంచిరా? మతిలేని మట్టి

బొమ్మలమని తలఁచిరా? వితంతువుల దుర్దశ విని, కష్టములఁగాంచి, గౌరవదూరులగుటకుఁ జింతించి, పండిత విద్యాసాగరుఁడను మహాత్ముఁడు, కేవల భగవత్స్వరూపుఁడు, పరోపకారపరాయణుఁడు తన యావజ్జీవమును పాటుపడి స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనియు, భగవదుద్దేశ్యమనియు, సంఘాభివృద్ధికరమనియు ననేక లక్ష్యములను జూపి యనేకులతోఁ జర్చించి సిద్ధాంతీకరించినను యెంతకృషిసల్పినను వితంతూద్వాహమునకు పురుషు లొప్పుకొనిరా? ఒప్పుకొనవచ్చునని యైనఁదలఁచిరా? కందుకూరి వీరేశలింగముగారు సాహసబుద్ధితో, పరోపకారచింతతో వితంతూద్వాహములఁ జేయవలయునని బాల వితంతువుల ననేకులను జేరఁదీసి కొందఱిపురుషుల నేవిధముగనో యొప్పించి, వివాహములఁజేయ వారి ప్రయత్నములు వ్యర్థప్రయత్నములని యాక్షేపించుటయేగాక వారిని కులమునుండి బహిష్కరించుటా—నోటికి వచ్చినట్లు తిట్టుచూ—పంతగించుటా—కామసౌఖ్యము పురుషులకెట్లో స్త్రీల కట్లేనని తెలిసికొనిరా? తెలిసికొనుటకైనఁ దలఁచిరా? కందుకూరి వీరేశలింగముగారు స్వర్గస్థులైన తరువాత నెంతకాలము స్త్రీలకుఁ బునర్వివాహములు చేయవచ్చునా? కూడదా? యని పూర్వపక్షరాద్ధాంతములతో గింజుకొనలేదు? అది యిప్పటికి మాత్రము తేలియేడ్చెడిదా? మనము స్వతంత్రించి విద్యను సంపాదించి మనలో మనము సంప్రతించుకొని సంప్రయోగమున పురుషులకన్న నేమాత్రముఁ దీసిపోక వ్రాయుచుండుటచే, తిరిగి తిరిగి యుపన్యసించుటచే, జ్ఞాన సంపాదకుల మగుటచే, నిఁక నేమియుఁజేయలేక, చేయుటకైనఁ దోఁచక, విధిలేక చెప్పుక్రింది తేలువలె, కాలిక్రింది చెప్పువలె నిపుడిప్పుడేగదా నోరు మూసుకొని దౌడలు నొక్కుకొని, పడియుండుట కలవాటుపడి యుండినారు, ఇప్పటికి వారి యాధిక్యమడఁగెను. వారి యహంకారములు స్రుక్కిపోయెను, వారి దుష్ప్రవర్తన ముంకుఁజెందెను, వారి దుర్గర్వ మణఁగెను, వారి దురభిప్రాయములు ముందటిల్లెను, మనపలుకులే వేదాక్షరములగు కాలము వచ్చినది, కావున నాకుఁదోఁచిన షరతులను కొంటినిమాత్రముఁ దెల్పెదను, వాటిని

లక్ష్మీబాయిగారి తీర్మానములవలె నా సోదరీమణు లాదరింతురని నమ్ముచున్న దానను.

1. స్త్రీలు తమ యిష్టమువచ్చిన వానిని వివాహమాడ వల యునేఁగాని పురుషుల యిష్టానుసారము వివాహముల జరుపఁగూడదు.

2. భర్త చనిపోయిన స్త్రీ మరల వివాహము చేసికొనవచ్చును. కాని భార్య చనిపోయిన పురుషుఁడు మరల వివాహముఁ జేసుకొనఁ గూడదు.

మీ రీవత్సరమున లక్ష్మీబాయిగారి తీర్మానములతోఁ బాటు నీరెంటిని శాసనసభలో చట్టములుగా మార్పించినచో పూర్వము వా రొనర్చిన దుర్నయములకుఁ బ్రతిఫల మనుభవించెదరు. దయయుంచుఁడు. ప్రస్తుత కార్యక్రమ మనుసరించి యధ్యావధానమును నల్పి యాశుకవిత్వసంపన్నురాలై యనేకగ్రంథములను రచించిన అరవిందమ్మగా రుపన్యసింతురు. అని యామె యా గద్దెపై నుండి దిగినవెంటనే తారాబాయిగారు పార్వతమ్మగారి తీర్మానముల రెండింటిని బలపరుప సభ్యులంద ఱేకగ్రీవముగ నామోదించిరి. తరువాత అరవిందమ్మగారు సభ్యురాండ్ర కరతాళధ్వనులతో నుపన్యాసరంగ మధిష్ఠించిరి.

---

## అరవిందమ్మగారి యుపన్యాసము.

---

సోదరీమణులారా! పూర్వకాలమున పురుషులు మన కొనర్చిన దుండగము లెన్నియైనఁ గలవు. ప్రపంచసృష్టికి సమానకారకులమైన మనల నడఁగ ద్రొక్కిన పురుషులు మనల నవస్తువులుగాఁ జూచిరి. మన యహంకారముఁ జంపిరి. మన యాత్మలను స్వాధీనముఁ జేసికొనిరి. భర్తను గోలుపోయిన పడఁతి బ్రతుకు కూడదని భర్తశవముతో పాటు భార్యను జితిపైఁ బరుండబెట్టి దహన మొనర్చుటొక యాచారముగాఁ జేసికొని యెందరి స్త్రీలను సహగమనమను పిశాచమున కాహుతులఁ జేయలేదు. మాకు జీవితముపై యాశగలదు. మేము చావమని కాళ్ళు కడుపులు పట్టుకొని బ్రతిమాలినను వల వల వాపోయినను,

యూరకొనెడి వారా? అవయవములను త్రాళ్లతోఁగట్టి వ్యాధు డొక పందిని గాల్చునటులఁ బ్రాణములున్న యీ వితంతువులను గాల్చెడివారే! రామ! రామ! వారి హృదయమున కంచుకాగడాలతో వెదకినను జాలి యగుపడునా? పరమనీచకృత్యమైన యీ సహగమనముల రూపుమాప సమకట్టిన రామమోహనరాయుల నెందరెన్ని విధముల దూషించలేదు? ఎందరు తలల పగులఁగొట్టుకొనలేదు? ఎల్లప్పుడును వారి పచ్చ — వారి సౌఖ్యము — వారి యారోగ్యముఁ జూచుకొనిరి గాని స్త్రీల సౌఖ్యములఁ దలంచిరా? మహమ్మదీయ ప్రభుత్వమునాటినుండి శతవర్షములక్రిందటివరకు మనలను మన జాతిని, రాణివాసమని బాధించిరే? తామెన్ని తప్పుడు కూడులు కుడిచినను — తప్పుడు పను లెన్ని చేసినను తప్పుడు నడత లెన్ని నడచినను — నడువవచ్చును. నడచినను యాక్షేపించువా రేరి? వారికి స్వేచ్ఛ గలదు, కాని స్త్రీలు తాము కాపురముఁ జేయుచుండెడి యింటిగుమ్మము వద్ద నిలువకూడదఁట! బంధువులతోడనైనను మాటలాడకూడదఁట! నోట మట్టిగొట్టుకొని, కన్నులు పోగొట్టుకొని, కాళ్ళు విరగగొట్టుకొని, యింటనొకమూల, బడియుండవలయునఁట! తాము — తమ యిష్టప్రకారము మన యెదుటనే పరస్త్రీలతో మాట్లాడుటలా — సరసమాడుటలా — సంతోషించుటలా — అదేమనిన యెడల మనల దిట్టుటా — కొట్టుటా — సూత్రముఁ ద్రెంపుటా — సుగంధపరిమళములతో నత్తరుసాయిబువలె సందుగొందులలోఁ దన యిష్టప్రకారము తిరిగి రాత్రి రెండుయామముల కింటికివచ్చి తిండి తిప్పలు లేక నిద్రించు నిల్లాలిని తిట్టుటా? చెప్పుఁ దీసికొని యింతవర కెచ్చట సంచరించుచుంటివని దౌడలపై గొట్టెడి కాంత లాకాలమున లేకపోవుటచే వారాడినదె యాటయై పాడినదె పాటయైనది. కాలము తమ యాధీనమైనపు డెన్నినీచకృత్యములనైనను మనచేఁ జేయించిరి. ఇప్పుడు చేయించగలరా? చేయుదుమా? మగని దాస్య మరువదిసంవత్సరములక్రిందటనే వదలి స్వేచ్ఛగా బ్రతికెడి మన మూ రాణివాసమును బురుషుల నెత్తిపైఁ ద్రోయవలయును. కాన నాకుఁ దోఁచినరీతి రెండు న్యాయములఁ దెల్పెద నాలింపుఁడు.

1. పురుషుల కెంతటి యవసరమగు పనియున్నను భార్య యానతి లేనిచో నిల్లువదలి వీధిలోనికైనను వెళ్ళకూడదు.

2. స్త్రీలు పురుషులను గొట్టినను దిట్టినను పురుషులు పల్లెత్తు మాటయైన ననకుండ పడియుండవలయును.

నా పలుకులయందు లక్ష్యముంచి నా నుడువుల నాలించి నే నిప్పుడు జెప్పిన యీ రెండు న్యాయములను లక్ష్మీబాయి పార్వతమ్మగార్ల తీర్మానములవలె మీరందరు ఆమోదించి యీవత్సరమున నే శాసన సభలో చట్టములుగా మార్పించినచో నిఁక పురుషులను కుక్కలవలెఁ గొట్టమా? కోతులవలె నాడింపమా? చీఁపురుఁగట్టకన్న నతిహైన్యముగాఁ జూడమా? సోదరీమణులారా! దయనుంచుఁడు అని యామె యాగద్దియపైనుండి దిగెను. అనంతర మొక లేమ లేచి అరవిందమ్మగారి తీర్మానముల రెంటిని బలపరుప సభ్యు లందరు ఏకగ్రీవముగ నామోదించిరి. తరువాత నగ్రాసనాధిపురాలగు సుబ్బమ్మారావుగారు నెమ్మదిగా నిలచి యిట్లుపన్యసించెను — సోదరీమణులారా! ఇప్పుడుపన్యసించిన మహిళాశిరోమణుల కోర్కెల ప్రకారము మీరందరు ఏకగ్రీవముగా నామోదించిన యీ తొమ్మిది తీర్మానముల నీ వత్సరమున శాసనసభలోఁ బ్రవేశపెట్టుటకు మీ కేమియు నభ్యంతరము లుండవని దలఁచెదను. అని యా యగ్రాసనాధిపురా లనుసరికి సభలోనుండిన కాంతామణులందఱు మా కేమియు నభ్యంతరములు లేవని కేకలువేసి చప్పటులఁ జరచిరి. ఇంతవరకుఁ గిటికీలోఁ గూర్చుండి వారిపలుకు లాలించుచున్న నే నాభామామణులకు వినుపించునటుల పెద్దగొంతుతో నిట్లంటిని—

నారీశిరోమణులారా! నామనవి యొక్కటాలింపుడు. నే నిప్పుడు చెప్పు విషయమును సాంతముగా వినక మధ్య మధ్య నడ్డు ప్రశ్నలు వేయకుఁడు. నామాటలు మీకు రుచింపవని నే నెఱుంగుదును. కాని యీసమయమున మాట్లాడక తప్పదు, కోపగించుకొనకుఁడు. కొట్టరాకుఁడు. అత్తమామల యాజ్ఞలలో మెలఁగి, ఆడుబిడ్డల యదపులలో నారితేరి, బావలయెడ భయభక్తులు కలిగి, మఱదులను

మన్నించి, భర్త తనకన్న నధికుఁడని, పూజనీయుఁడని, దైవసమానుఁడని దలఁచి పరమ పతివ్రతామణు లనిపించుకొనిన పూర్వకాలపు పూఁబోఁడులకన్న తెలివితేటలుగలవార మనుకొనుచుండిన మీరు, సకల విద్యాసమన్వితుల మనుకొనుచుండిన మీరు, నవనాగరికుల మనుకొనుచుండిన మీరు, జాజిపూలను ముడిచెడి జాలుకొప్పుల నుజ్జగించి, మొగములు క్రిందికి వంగ, బిగింపు చాలదని మీరు సకిలింప, చేతుల మంటచే బిగించువా రిగిలింప, మీ మాడుపట్టులపైనున్న వెండ్రుకలును ముచ్చిలిగుంటలలోనున్న వెండ్రుకలును రాలిపోవ, చర్మము తిత్తులు తిత్తులుగాఁ బైకుబ్బ, గరిటెకాఁడలవలె చిటిచాపయల్లికలవలె, సంచులవలె ననేక విధములుగా నల్లించుకొనెడి మీ జడలను, తేనెతుట్టెలకైవడి — తేలుకొండెల మాదిరి — చుట్టకుదురుల చందమున — చూరెలుకలతీరున — పడిగములపోలిక — పద్మవ్యూహములచాయ — పలువిధములుగా నపూర్వమైన యల్లికలతో, పిచ్చి పిచ్చిరూపములతో ననేక తెఱఁగుల నల్లించుకొనిన జడచుట్టులతో మీ శిరోజములను నలుఁగఁగొట్టుకొని, సాఁగఁదీసుకొని, త్రెంపుకొని, పరమసౌందర్యముగా, నుండెనని మురిసెడిమీ రాజడచుట్టులపై మొగలిపూవులను ముడుచుట మోటుగాఁ దలఁచిరి. చేమంతిపుష్పములఁ దాల్చు టతి నీచముగా నెన్నుకొనిరి. మల్లెపూల ధరించుట మర్యాద కాదని వానిపై మమతఁజెందకుండిరి. సంపెఁగపువ్వులఁ బెట్టుకొనుట సరసము గాదని భావించితిరి. నిస్సారములై, నిర్గలితములై నిరుపయోగములైన కాగితములతోఁ జేయఁబడిన పుష్పములను, రంగుగుడ్డలతోఁ జేయఁబడిన పూవులను, జీలుగుబెండుతోఁ జేయఁబడిన పువ్వులను, యినుపసూదులతో మీ జడచుట్టలపై గ్రుచ్చుకొని మురియుచున్నారు గదా ? వసంతుఁ డిచ్చిన కుసుమములకన్న నీవెఱ్ఱి మొఱ్ఱికృత్రిమపుష్పములు సౌందర్యప్రథములని దలఁచిరా ? సువాసన నిచ్చునవని ధరించిరా? సుగుణ పుంజములని దాల్చిరా ? తల్లులారా ! మీ నవనాగరిక మీ కృత్రిమపుష్పములవల్లనే నిలుచును గాఁబోలు—ముంగురులపై ముద్దుల మూటఁగట్టఁ దాండవమాఁడు సూర్యచంద్రులను త్యజించి ముంగురులు వంకర టింకరగా, మెలికలు మెలికలుగా నుంగరములవలెఁ దిరిగియుం

డుట సోయగమని దలంచి మీ తలవెండ్రుకల నీచెంపయు నాచెంపయు బెత్తెడు వెడల్పునఁ గత్తిరించుకొని, మెలికలు మెలికలుగాఁ ద్రిప్పుటకు రెక్కలు విఱుగఁగొట్టుకొని కుదురుగాఁ గుదుర్చుకొనిన మీముంగురులు గాలి కల్లలనాడి కన్నుల పైబడ, మొగములు చిన్నవిగాఁ గనఁబడ నేత్రదృష్టి సన్నగిల్ల నేమంత సౌఖ్యపడుచున్నారో మీకుఁ దెలియదా? కేశములకు రాచుకొను కొబ్బరనూనెను ద్యజించి, వెండ్రుక లొత్తుగా నెదిగి వృద్ధిఁజెంది మెత్తఁబడునని ఘుమ ఘుమలాడు సువాసన నూనె లను యుపయోగించుచున్నారుగదా? మీ రావాసన నూనెలను శిరోజములకు రాచుకొనిన తరువాతఁ గొంతసేపటి కానూనెలయం దావిరి రూపమున నుండిన యత్తరు లెగిరిపోయి యందుఁ గలుపఁబడిన యాముదము మీ వెండ్రుకల కంటుకొనియుండుటచే మీ శిరోరుహము లిప్పుడు మెతకవాసన వేయుచున్నవి. శిరోజవృద్ధికి మూలమని యెం చిన నీతైలములవలన మీ శిరోరుహము లిప్పుడు తెల్లబాఱి మీరు బాలప్రాయమున నున్నను వయోవృద్ధులవలె నితరులకుఁ గనుపించు నటులఁ జేయుచున్నవి. తెల్లఁబడిన వెండ్రుకలు నలుపుఁజెందునని దలఁచి మీ రుపయోగించెడి రంగులమందుల వలననేగదా! సతులకు సహజభూషణములని—సౌందర్య ప్రథమములని—సర్వదేశములందు సర్వజాతులం దెంచుకొనెడి శిరోరుహములు పటిమఁదప్పి, పట్టువదలి పడిపోవ, బట్టతలల భామామణు లనిపించుకొనుచున్నారు. నవనాగరిక మాహాత్మ్యము మిమ్ములను బట్టతలల భాగ్యశాలినులుగాఁ జేసివైచి నదిసుమా—

మహామారిని సహితము మారణ మొనరించెడిదియు, మొగము నంగల మొటిమలను మొదలంట నశింపఁజేయఁ జాలెడిదియు, సుభ గత్వమునకు మూలమైన పసుపు, వంటపాత్రలయందే గాని మీ వదన ములయందైనను, చివరకు మీ పాదములయందైనఁ గానరాదే? మొగ ములయందు రవంత పసుపు రాచుకొనుట కేవగించుకొనిన మీరు— నాటకములయందు పురుషుఁడాడుదాని వేషమును వేసుకొనునపుడైన పూసుకొనకుండు నంతటిదళసరిగా 'ఫేస్‌పౌడరును' రాచుకొని, కళా కాంతులుగల మొగములను తెల్లమొగములుగాఁ జేసుకొని యున్నపు

కుండ లనిపించుకొనుచున్నారే! సోదరీమణులారా! మీ తల్లులు, మీతల్లుల తల్లులు; వారినిఁ గన్నతల్లులు, తలలలోని వేడిమిని తగ్గించెడి, కండ్లమంటలఁ గలుగకుండఁ జేసెడి, కన్నులను నిర్మలముగానుంచి దృష్టిమాంద్యముఁ గలుగకుండఁ జేయఁజాలెడి యౌషధమైన కాటుకను నిత్యముఁ గన్నులకు ధరించుకొని సుఖించినారుగదా? మీ రీనవనాగరిక మహాత్మ్యమునఁ గాటుక ధరించుట మోటుగాఁ దోఁచుటచేఁ గాటుకను ద్యజించి కంటిజోళ్ళను ధరించి మీ రేమి సుఖించుచున్నారు? సుఖము శూన్యమై పైపెచ్చు కన్నులలోని చెమకునశింప, కుఱుచ చూపులు గ్రుడ్డిచూపులు మీ కీకంటిజోళ్ళవలనఁ గలిగినవని యిప్పటికైన దలఁచెదరా? ప్రతిదినంబును గాటుకను ధరించిన వారి కీబాధలున్నవా? మీకుమాత్ర ముండెడివా? నవనాగరకమను పిశాచము మీపాలిట కండ్లజోడై మీ దృష్టులను జెరుపుచున్నది—నాగరిక శిరోమణులారా! చేఁదబావి చెంతను వంగి నీరు చేఁదునప్పుడు, నిండుబిందెను భుజముపైఁ బెట్టుకొని నాఁపరాళ్ళ మెట్లపై నెక్కునపుడు, అన్నపుగుండిగలను పొయ్యిపై నుండి దించు సమయమున, నడుమువంచి బరువుపను లేవైనఁ జేయునపుడు, నడుము బెణఁకకుండ, నరములు సడలకుండ, జననకోశస్థానము చెదరకుండ, నడుము బింకము చెడకుండ, సముకూర్పఁజాలెడి సాధనమగు యొడ్డాణమును పూర్వులు ధరించిరి. నవనాగరికులమనుకొనుచుండిన మీరు పీపాకట్టులని, పిండస్థానమున కుచ్చులని, యింక నేమోయని యవకతవక పోలికలను బోల్చి జననకోశమును కాపాడునవై యవలగ్నముల కలంకారములైన యొడ్డాణములను మీరు ధరింపక పోవుటయేఁగాక నితరుల నాక్షేపించుచు కొనుఁగజోళ్ళవలె నడుములను బెంచుకొని, నేవళమును జెడఁగొట్టుగొనుచున్నారుగదా? ఆంధ్రవనితలారా! అయ్యో! అదేమి? మీ చెవులకు చిన్నమెత్తు సువర్ణమైన చీమతలయంత ముత్తెమైన లేక పూర్వకాలపు గంగాభాగీరథీ సమానురాండ్రవలె నున్నారే? నాసికాభరణములయిన ముక్కుపుడకలను మూలఁ బారవైచితిరా? అడ్డబాసల నంతమొందించితిరా! ముక్కుపోఁగులను మూసలలో వైచి కరఁగించితిరా! (పడిసెము పట్టినప్పుడు కష్టముగా నుండునని తీసివైచితిమి. అని సభలో

నుండి కేక) పసుపుబొండులతోఁ గంఠములందుండవలసిన సూత్రములు నల్లపూసల చేరులు మీమెడలయందుఁ గానరావేమి ? త్రెంపిపోసితిరా ? (త్రెంచిపోయ లేదు. బంగరుతీగలతో నల్లబడిన త్రాళ్ళలో నుంచుకొంటిమని సభలో కేక) అమ్మలారా ! ఆసంగతి నాకు దెలియకగాదు. బంగరుత్రాళ్ళతో వానిసి మీరు బంధింపఁబట్టియే మీ రభ్యంగన మొనర్చునపుడు నలుఁగుఁబిండి యాత్రాళ్ళలోఁ జిక్కుకొనునని వానిని మీ కంఠములనుండి తప్పించి యేదిలుకకొయ్యలకోఁ దగులఁజేసి మీరు తలంటుకొనుచున్నారా ? లేదా ? అక్కలారా ! మ్రోరుపల్కరేమి ? మీ పాదముల కాభరణములైన కడియములను ఖండించివైచితిరా ? అందెల నవనియందుఁ బూడ్చియుంచిరా ? తుమ్మకాయగొలుసులను తూరుపాఱఁ బట్టితిరా ? (బూట్సులు తొడుగుకొనుట కడ్డముగానుండుటచే ధరింపమైతిమని సభలోనుండి కేక) శీతలదేశమున వసించుచు మంచుతోనిండి యుండెడి ధాత్రిప్రదేశమునఁ దిరుగవలసిన వారగుటచేఁ బాశ్చాత్యులు బూట్సులను మేజోళ్ళను వాడుచున్నారు. వారు వాటి నుపయోగింపనియెడల చలిచే కాళ్ళు కొంకరపోవును. ఉష్ణదేశమున నివసించు మనకు వానివలనఁ బ్రయోజన మీషన్మాత్రమైనను గానరాదు. ఇల్లువదలి వీధిలో నడుగిడినయెడల బురదలో మోఁకాళ్ళవఱకు కూరుకొనిపోవు మనము వాని నుపయోగింపకుండిన యెడలనే మంచిది. అమ్మలారా! మీ రాంధ్రజాతివారేనా? కుంకుమబొట్టు నెత్తురుచుక్కవలె మొగమునఁ గనుపించుననియు, పసుపు రాచుకొనినయెడల శరీరము మోటుఁదేలునని పసుపుకుంకుమను ద్యజించి, బూట్సులతో — మేజోళ్ళతో — గౌనుగంతలతో — జాకెట్లతో — పిన్నీసులతో — వట్టి చెవులతో — వట్టిముక్కులతో — వట్టిచేతులతో — వట్టినడుములతో — వట్టికాళ్ళతో మీ రింగ్లీషునారీ లలామలవలె నున్నామని కులుకుచున్నారా ? మీ రూపములఁగాంచి, మీనడత నవలోకించి, మీవెనుక ముందుల నెత్తుపొంకములను జూచి, యాపాశ్చాత్య భామామణు లెంతనవ్వుకొనుచున్నారో మీ రెఱింగితిరా ? బిగించుట కనువై శరీరమును సడలనీయకుండునటుల పట్టుకొనియుండెడి పూర్వకాలపు ఱవికలనుద్యజించి జాకెట్లను ధరించి మురియుచున్నారు

గదా? గాలి తాకుటకనువైన—కట్టుకొనుటకు సులువైన— గాలికెగిరి పోక శరీరము నంటుకొనియుండెడివైన—నిప్పుబాధ కలిగినచో వెంటనే విప్పివేయుటకు వీలుఁగలిగిన—మనదేశకాలపాత్రల కనువైన — మన పూర్వులు ధరించిన—మన దుస్తులయొక్క సౌందర్యమును, ఘనతను, యుపయోగమును దెలుసుకొనఁజాలక, గడ్డిపోచవలెఁ దృణీకరించి యితరదేశీయ దుస్తులను ధరించి మీ సురూపములను జెడఁగొట్టుకొని, కురూపములను దెచ్చిపెట్టుకొని, క్రైస్తవవేషములతో మీ జీవితములను గడపుచున్నారుగదా ? ఔరా! నవనాగరికతామహాత్మ్యము! మీ రూపములను దొంగిలించి, అమంగళకరములైన పనులను మీచేఁ జేయించి, మీ శరీరారోగ్యమును ద్రుచ్చిలి, మిమ్మెంత యధోగతి పాలొనర్చెను? సుందరీమణులారా! నవనాగరికత యనుకొని మీశరీరారోగ్యములను, మీ జీవితమర్యాదలను, మీ సంసారసుఖములను పాడుచేసుకొనక, పూర్వాచారములై పూఁబోఁడుల కనువైన యాచారములను గైకొనుఁడు. చెంద్రుకలను ద్రెంపుకొనక జడచుట్టననుద్యజించి సుందరములైన కొప్పులను బెట్టుకొనుఁడు. సున్నపు కుండలవలె మొగములను గనఁబఱచు ఫేసుపౌడరు పూఁతలనుమాని ప్రతిదినోదయోదయమునను స్నానమొనర్పవలసిన మీ రోకింతపసుపును మొగములపై రాచుకొని మీ శరీరారోగ్యములను గాపాడుకొనుఁడు. వంటకములఁ జేయఁ బొయివద్దఁ గూర్చుండు మీకు కంటిమంటలు కలుగకుండ కన్నులలో కాటుకను ధరింపుఁడు. (మాకు వంటవాండ్రును దాసీలును యున్నారు. అని సభలోనుండి కేక) అటులనా? మీకు దాసీలెందుకు? దినమున కైదారుసారులు పన్నీరుబుడ్లను మీరు ధరించిన దుస్తులపైఁ జిలుకరించుకొను మీరు దినమునకొక్కమారు మీరు కాపురముండు యిండ్లను దుడచి పేడనీళ్ళ నట్టుజిలకరింపలేరేమి? దినమున కైదారుసారులు సబ్బుబిళ్ళలతో మొగమును దోముకుందురుగాని, దినమున కొక్కతూరి వంటపాత్రలను దోమలేరేమి? నోరు నొప్పిలేకుండ ఘంటలతరబడి బతికలను జదివెదరుగాని పొయివద్ద కాసంతసేపుఁ గూర్చుండి వంటకములను సిద్ధముఁ జేయలేరేమి? అమ్మలారా! వంటవాండ్రు యవకతవకపను

లచే నెన్ని సంసారములు ధ్వంసమగుచుండుటలేదు ? ఎన్ని భక్ష్య పదా ర్థములు పెంటప్రోగుల పాలగుచుండుటలేదు ? వానినెల్లఁ గన్నులతోఁ గాంచుచుండిన మీరు మాకు వంటవాండ్రును దాసీలును యున్నారనఁ జెల్లునా ? ఇప్పటికైన విదేశీయగంతలను త్యజించి స్వదేశవస్త్రముల ధరింపుఁడు. విదేశీయ యాచారముల నాచరణలోఁ బెట్టుటమాని స్వదేశాచారము లాచరించి యాంధ్రనారీలలామ లనిపించుకొనుఁడు. ( మా వేషములతో నీకేమిజోక్యముగలదు ? యితర విషయములను గురించి చెప్పఁదలఁచినచో ముఖ్యముగా మూఁడుమాటలతో ముగింపుము. అని సభలో నుచితాసనమునఁ గూర్చుండి యుండిన యగ్రాసనాధిపురాలు పలికెను. )

సోదరీమణులారా ! మీయందచందములను, కట్టుబొట్టులను కీముమేళ్ళను విమర్శించుచున్న నాపలుకులు మీకు ములుకులవలెఁ దోఁచెనా ? నిజమాడిన నిష్ఠురము వచ్చుననులోకోక్తి మీయెడ నేఁ గాంచితిని. మీకిష్టములేని విషయములను నేను జెప్పనేల ? మీరు నాపలుకులు వినక దిక్కులఁ జూచుచుండుటయేఁగాక మా వేషము లెట్లుండిన నీకేమని ప్రశ్నింపనేల ? తల్లులారా ! వినుఁడు. నామాటల యందు లక్ష్యముంచి వినుఁడు—నవనాగరికతా పద్ధతుల ననుసరించి మీ భర్తలు మీకీవిదేశీయ దుస్తులను వస్త్రములను దెచ్చియిచ్చి మీ యాజ్ఞానువర్తులై మెలఁగుచుండిరిగదా — సంగీతము నేర్చుకొనుట యిష్టముగానున్నదని మీనోటినుండి వెడలు టాలస్యముగాఁ దమతలఁ దాకట్టుపెట్టియైన మీకొరకు ఫిడేళ్ళను హార్మోనియములను కొని యిచ్చి నేర్పువారిని సిద్ధపరచిరిగదా—ఆంగ్లేయమర్యాదల ననుసరించ మాకిష్టముగానున్నదని మీరనిన వెంటనే దొరలుగురనో రప్పించి వారితో మీకుఁగరచాలనమహోత్సవ మిప్పించినారుగదా — మీరీ నవనాగరిక సభల కుపన్యసించుటకోఁ జూచుటకో వచ్చునపుడింటివద్ద

నేర్చెడి పిల్లలనోదార్చుచుఁ జెయిగాల్చుకొనుచున్నారుగదా—మీరీ నవనాగరికతాపద్ధతుల ననుసరించి మొండికాళ్ళతో, మొండిచేతులతో, మొండిముక్కులతో, మొండిచెవులతో, గంగాభాగీరథీసమానురాండ్రవలె నుండుటఁజూచి లోలోపల నేమనుకొనినను పైకినవ్వుమోములతోఁ గనబడుచున్నారుగదా—మోటుగానుండుననిపసుపుకుంకుమలను ద్యజించి మీరుపాడు మొగములతోనున్నను చచ్చినట్లు నోరుమూసుకొని పడియున్నారుగదా — ముంగురులకొఱకు మీరు మీశిరములముందుండు వెండ్రుకలను కత్తిరించుకొనునపుడు బ్రతికియుండియు తామాకర్మమును జూడవలసివచ్చెనుగదా యని తమలో తామేమి యేడ్చినారోకాని పైకిపల్లెత్తు మాటన్నైనయనిరా - మీసంతోషముకొఱకు మానాభిమానములయినఁ జంపుకొని, మీరేప్రాణసమానులని, మీకృపతోడనే తాము వర్ధిల్లవలెనని మీకొఱకై తల్లిదండ్రులఁ ద్యజించి, అన్నదమ్ముల నవలఁద్రోచి, అక్కసెల్లెండ్రకక్కఱమాలినవారై, బంధువులఁ బరిత్యజించి, మీరే వారి సర్వస్వమని నమ్మి, మీకు దాసానుదాసులై, మిమ్మే నమ్ముకొనియుండిన భర్తలను మీ రిసుమంతైనఁ బ్రేమించుచున్నారా? ప్రేమింపవలెనను కోర్కెయైన మీ మనంబులకు నేఁడుదట్టుచున్నదా? మీదయకొఱకిన్ని విధములఁ బ్రాకులాడుచుండిన భర్తలను, మీసంతోషముకొఱకెట్టి నీచకృత్యములకైనఁ దలకొనుచుండిన భర్తలను, మీ చెలిమికొఱకు సకలబంధువులఁ ద్యజించి మీరే లోకమని నమ్మి పడియుండి పనికిమాలినవారైపోయిన మీ మగల మానసత్త్వముల నపహరించి మంటిబొమ్మలఁ జేయవలెననియే, మీయభిప్రాయమా— ( భసలో నస్పష్టములైన పలుకులు ) సోదరీమణులారా! ఏవియో యస్పష్టమైన పలుకులను మీరనుకొనుచున్నారు. మీ యుపన్యాసములలోని తీవ్రమైన విషయములను బట్టియే నే నిటుల మాటలాడ

వలసి వచ్చినది. మి మ్మధిక్షేపించుచున్నాఁడనని తూలనాడకుఁడు. తొలఁగిపోకుఁడు — ప్రతిదినంబును తమ్మనుసరించి చరించెడి భర్తలను జూచునపుడైన, మాటాడునపుడైన మీ పూర్వకాంత లొకింత జంకుతో, కొసంత తొట్రుపాటుతో, రవంతకొంకుతోఁ జరించెడి వారు. నవనాగరికతామహత్త్వమున పురుషులతోఁ గలిసిమెలసి తిరుగుచుండిన మీరు — సభలలో నుపన్యసించుచున్న మీరు — న్యాయపరిపాలన మొనర్ప నుద్యోగములను స్వీకరించిన మీరు—పరపురుషులఁ జూచునపుడు, ఎదుర్కొనునపుడు, సంభాషించునపుడు, మీ దృష్టు లొకింతయైనఁ జలింపక స్థైర్యముతో, తీక్ష్ణముతో, నిక్కుతోఁ బ్రసరించుచుండినవి. మీ దేహసత్త్వములు రొత్తిగిల్లుటకైన సంకోచము నొందకుండినవి. నిర్లక్ష్యముతో, నిర్భయముతో, నిరర్గళముగాఁ దిరుగుచు, నడతలలోనేమి, చూపులలోనేమి, పలుకులలోనేమి, మగతనమగుపరచుచున్నారుగదా ? వేషభాషలలో స్త్రీల ననుకరించు పురుషులను జూచి యాడంగిపెద్దమ్మలని వారిని మీరెంత పరిహాసించెదరో యటులనేఁ బురుష లక్షణములుగల స్త్రీలనుజూచి మేముఁ బరిహాసించెదమని దలఁచుడు. తల్లులారా ! పురుషులలో నెందరో కేశఖండన మొనర్చుకొని, పాపటలఁ దీసికొని మీలో గంగాభాగీరథీ సమానురాండ్రలోను, సౌభాగ్యవతులలోను జేరినవారికి బుద్ధివచ్చునట్లు మీరైనను స్త్రీత్వమును నిలుపఁబెట్టుకొని దేవపూజ లొనర్చుచు, బీదసాదలఁ బోషించుచు, గృహకృత్యములం దలక్ష్యముఁజూపక సంబాళించుకొనుఁడు. ఇప్పటికే పాకము ముదిరినటులఁ గనుపించుచున్నది. ముదురఁబెట్టుకొనకుఁడు—మోసపోకుఁడు — విద్యాధికులమై, కవితామతల్లులమై, సభలలో నుపన్యసించుచు, దేశక్షేమలాభకరములైన పనులఁ జేయు మాకు గృహకృత్యముల నిర్వర్తింప వీలు లేదనెదరేమో ! ఆకలి

బాధచే నేనుపిల్లల కాహారము సిద్ధముజేసి వారిరోదనముడిగించుట కన్న మీరు కవిత్వమల్లి గ్రంథముల రచించుటొక లెక్కకాదు — మీ కడుపులలోనున్న బిడ్డలను గాపాడుకొనుటకంటె కాగితములపైం జిత్తరువులను వ్రాయుటొకఘనకార్యము కాదు — నిద్రపోక యేడ్చుచుండెడి పట్టినిం దొట్టిలోం బరుండంబెట్టి జోలపాటలంబాడి పట్టివాని రోదనమును మాన్పించుటకన్న సభలలో మీరు సంగీతమును బాడి గానకళానిపుణురాండ్రనిపించుకొనుటొక గొప్పకాదు — చంటిపిల్లలు కడుపునొప్పిచే గిలగిల తన్నుకొనునపుడు కాసంతశొంఠిముక్కతో వారిబాధ నివారించుటకంటె మీ యాంగ్లేయవైద్యశిఖామణు లనిపించుకొనుట ఘనకముకాదు — గృహకృత్యముల నిర్వర్తించుకొనుచు సభ్యాగతుల కన్నమిడుటకంటె రాచకార్యముల నిర్వర్తింప యుద్యోగములను స్వీకరించుట బెడంగుకాదు — (చాలుచాలు నీనీతుల నింకం గట్టిపెట్టుము నీ యుపన్యాసమును ముగింపుము. నీ కొక్కిరిపలుకులను మేము వినము, అని సభలోనుండి యొకకాంత పల్కెను) సోదరీమణులారా! మీకుం గష్టముగానుండు విషయములంజెప్పి మీ మనస్సుల నొప్పించితినని నే నిప్పుడు వగచుచున్నాఁడను. సద్దుఁజేయక నాపల్కుల నాలింపుఁడు — అమ్మలారా! మీ పురోవృద్ధికొఱకై మీకు విద్యను జెప్పించి, సకలకళలను నేర్పి, ప్రభుత్వమువారిచే నుద్యోగముల నిప్పించి, శాసనసభలలో సభ్యురాండ్రుగా నుండునటులఁజేసి, మిమ్మింతవఱకీడ్చుకొని వచ్చినది పురుషులేఁ గదా? ఈయిరువదవశతాబ్దమున నట్టిపురుషుల స్థానాభిస్థానము లూడలాగుకొని కీలుబొమ్మలవలెఁజేసి యాడి యింపముఁబెట్టి వారిపురుషత్వమును బుగ్గిచేయవలెననిగదా మీ యభిప్రాయము? అట్లెన్నఁడుఁజేయ సాహసింపకుఁడు. వారిస్వాతంత్ర్యమును మాత్రము చంపకుఁడు. (అదే తలబిరుసు. అని సభలో

నుండి లేక ) వారికిఁ దలబిరుసుఁదన ముండెనని తలఁచెదరా? పటిక బెల్లపు ముక్క పంటిక్రింద కటకటలాడుచుండినఁ గాని రుచింపదే— పోఁక చెక్క దంతముల కొంకురుఁ జిరిగి కటుక్కు మనినఁగాని తృప్తిపొందరే. అట్టి మీరు మీభర్తలను పనికిమాలిన పందలవలెపడవైచినచో మీకు మాత్ర మేమి గౌరవము? ఏమి సౌఖ్యము? మీరు మీభర్తలను దైవములవలెఁ జూడుఁడని తెల్పినచోఁ దలవొకదెబ్బను కొట్టుదురని యెఱుంగుదును గాని బానిసలవలెఁ జూడకుఁడని మాత్రము మిమ్ము హెచ్చరించుచున్నాఁడను. భర్తను భగవంతునిగాఁ జూడవలయునని పూర్వులెందుకు శాసించిరో మీకుఁ దెలియునా? భర్తయందు మీకుఁ గల గౌరవమును బట్టియే మీకు సంతుకలుగును, భర్తను భగవంతుని వలెఁ దలచినచో వేల్పుల వంటి పిల్లలు మీకుఁగలుగుదురు, భర్తను బానిసీఁడుగాఁ దలఁచినచో మీరు పందలఁగందురు. ఈ విషయమును నమ్ముఁడు. అభిమన్యుని సుభద్రయే కనవలెను గాని మఱియొకతె కనఁ గలదా? శివాజీని జిజాబాయియే కనవలెగాని మఱియొకతె కనఁ గలదా? భర్తను భగవంతునితో సమానముగాఁ జూచుకొనుట వలననేఁగదా వారట్టి సుపుత్రులఁ గనిరి. ఈకాలమున యట్టివారు పుట్టరెందువలననో, దెలుసుకొంటిరా? భర్తలు భగవత్సములా యని వెఱ్ఱి ప్రశ్న వేయకుఁడు. భర్తలు భగవత్సములు కాకపోయినను మీరు భావించుటకేమి లోపమున్నది? ఇట్టి భావనాలోపములవలననే మన జాతికి బానిసత్వమెక్కువ యగుచున్నది. మీభర్తలను మీరు గడగడలాడించునప్పుడు మీకుఁ బుట్టు బిడ్డలెలుకలనుజూచి భయముఁజెందినారనుటకేమి యాశ్చర్యము? కావున పిచ్చి పిచ్చికోర్కెలను గోరుకొనక సుపుత్రులఁ గనవలెనని దలఁచుఁడు. సోదరీమణులారా! అదేమి— నన్నుఁజూచి కొఱకొఱలాడెదరేమి? ఇంకొక మాటవినుఁడు. మీ యమ్మలు, వారి యమ్మలు వారి యమ్మమ్మలు వారి వారి భర్తల

నెట్లు గౌరవించిరో యెట్లు పూజించిరో, మీరును మీభర్తలను పూజింపుఁడు. మీభర్తలదేహామే మీది, వారి మానప్రాణములు మీచేతులలోనున్నవి. వారివలననే మీరిటులఁ బుష్టించికాయలఁ గాయుచున్నారు. అట్టి మీభర్తలను గన్నులలోఁ బెట్టుకొని పూజింపవలయునేఁగాని బానిసలవలెఁ జూడఁదగునా? భగవంతునివలెఁ జూడవలసినదేఁగాని...

నాయనలారా! కిటికీలో నిలిచియుండి యింతవరకు నే నుపన్యసించుసరికి నా పలుకులను వినిన పాపము వచ్చుననియో—తమ సభాకార్యములఁ జూచుకొనవలసియో — ఎవరి యిండ్లకువారు వెళ్ళవలెనని దలఁచియో — యొక లేమ నేను నిలచియున్న కిటికీవద్దకువచ్చి కిటికీరెక్క నొక్కతోపుఁదోచెను. ఆపెతోపుతో నాకిటికీ రెక్కవచ్చి కిటికీబద్దెను బట్టుకొని యుండిన నాహస్తమునకు టక్కునఁ దగిలెను. ఆ దెబ్బతో నూతగాఁ గొనియుండిన యాబద్దెను నేను వదలుటచేఁ గిటికీలోనుండి క్రిందపడితిని. ఇంతటితో నాకల సమాప్తి నొందినది. కన్నులను విప్పిచూచితినిగదా? నేను నిద్రింపకమునుపు పండుకొనిన మంచము ప్రక్కనుంటిని. తలయొక్క తందర వెంటనే నశించెనుగాని కలలో మంచముపైనుండి క్రిందఁబడునపుడు దెబ్బతగిలిన కాలునొప్పి యింతవరకును బాధించు చుండెను.

---

—♦ సిద్ధసేనుఁడు నాగరబ్రాహ్మణుల సన్మానించుట. ♦—

ఆ॥ అట్లు నారదర్షి యాతని దారిద్ర్యమునకుఁ గుష్ఠరుజకు ముఖ్యమైన
కారణములఁ జెప్పి క్రమ్మఱ ధరణీశ! యెుక్కఁడైన ప్రేమ నిట్టులనియె. ౨౭౭

తే॥ "నీదు దారిద్ర్యమునకును నిష్ఠురంపుఁ గుష్ఠరుజకును నుండిన ఘోర కార
ణమును దివ్యదృష్టి గురుతెఱింగి మహిసాధ! వినిచినాఁడను నీకు సవిస్తరముగ.

క॥ ఇఁక నీకుఁ గ్రమముగఁ బ్రకటంబగు పరిభవంబు ప్రాప్తించుట కే
దుష్కృతము కారణమయ్యెనొ ప్రకటించెద నాలకింపు పార్థివ దానిన్. ౨౭౯

క॥ ఆనర్తరాజ్యమందున నీనికిఁ బట్టాభిషేకవిధి జరిగెడినో
యానరనాథుఁడు ప్రథమము తా నాగరసవిధమునకుఁ దరిలెను భక్తిన్. ౨౮౦

క॥ నీవు ప్రమాదవశంబున నావిధముగ జరుపవైతి. వదియునుగా కా
భూవిబుధుల శాసనము గావించితి యాచ్ఛాసెయఁగాఁబడి కూడన్. ౨౮౧

తే॥ తండ్రితాతలనాఁటి యాధరణిసురుల శాసనంబులు గ్రొంచి తీసుమెయిని.
దాన మార్తుర ని న్నవమానపఱచి రిమ్ము తచ్ఛాసనంబుల నీవు మరల" ౨౮౨

క॥ అనియిటు వక్కాణించుచుఁ జనియాతఁడు శంఖతీర్థసవిధంబునకున్
మునిఁగియుట సమర్థ్యగముగు ఘనసాగరభూమిదేవగణమును భక్తిన్ ౨౮౩

ఆ॥ పిలిచి కాళ్ళకడిగి యులఘు శంఖాదిత్యు నెదుటఁజేరి నూటయిరువదాఱు
శాసనంబులిచ్చి సను సెను దచ్ఛత్రుసంచయంబు తత్ప్రసాదమునను. ౨౮౪

క॥ ఈశంఖతీర్థమహిమ మిదేశా! యంతయును నీకు నేఁ జెప్పితి నిం
కేశుభచరితము వినెదో త్వదాశయ మెఱింగింపు" మనుచు నమ్ముని మఱియున్.

వ॥ బహువిధేతిహాసంబులు వచించె" నని వాత్రుచ్ఛుటయు. ౨౮౬

ఆ॥ "హాటకేశ్వరమున నలరారునటువంటి పెక్కుతీర్థములను బ్రీతితోడ
నీముఖమున వింటిమే, మిఁక గాధేయుతీర్థపుంమహాత్త తెలుపవయ్య" ౨౮౭

క॥ అనియిటువాత్రుచ్ఛుటయును మనమున నొకకొంతసే పుమాసహచరు ని
క్కానఁజేసి శౌనకాదులఁ గనుగొని సూతుండు మృదువుగా నిట్లనియెన్. ౨౮౮

—♦ రత్నేశ్వరోపాఖ్యానము. ♦—

వ॥ పారావారపారంబును నవనీతలాంతింబును నక్షత్రసంఖ్యయుఁ గనుగొన నగుంగాని విశ్వామిత్రు గుణగణంబు లెక్కింప నొక్కనికిని వశంబుగాదు. క్షత్రియుఁడయ్యు నెవ్వఁడు బ్రహ్మత్వము సాధించె నెవఁడు చండాల భావంబెనసిన త్రిశంకునిచే యజ్ఞంబుసేయించి యందు దేవతలకు హవిర్భాగంబు లిప్పించె నెవఁడు బ్రహ్మతోడి స్పర్ధమై సృష్టి నుపక్రమించి క్రతుభుజులు కాళ్ళపట్టుకొన మగుడఁ జాలించె నా గాధేయు

తీర్థపుం బ్రభావము గీర్తించెద నా మహాత్ముండు ఖననసాధనం బెద్దియు లేకుండ దన చేతిమీఁదుగా నొక కుండంబు త్రవ్వి ధ్యానబలంబునం బాతాళంబునుండి గంగను రప్పించి దానం బూరించె. భూతలంబున కానీతంబగు తద్గంగాజలంబు నిర్మలంబును స్వాదువును నై స్నాతుల సర్వపాపంబులను హరింపఁగలిగియున్నయది. గాలవమునీంద్రుఁ డచట నాదిత్యుఁ బ్రతిష్ఠించియున్నవాఁడు. మాఘశుక్లసప్తమీభానువాసర మాఘ్రా దంబునఁ గుండంబున నయ్యాదిత్యున కభివాదమాచరింప నఖిలకష్టంబులును నఖిలాఘంబు లును నశించు. దాని పశ్చిమోత్తరదిగ్భాగంబున ధన్వంతరిచే నిర్మింపఁబడి సర్వరోగ నివారకంబగుచు నొక నడబావియుండెఁ. దొల్లి యచట ధన్వంతరి తపంబొనరింపఁ బెద్ద కాలంబునకు భాస్కరుండు ప్రత్యక్షుండై వరమడుగుమన నతండు ౭౮౯

కం॥ "ఏతత్కుండంబున సుస్నాతుండగునట్టిజనుని సకలామయముల్
భూతములు కావలయు ఖద్యోతా! నాశితసమస్తదురితవ్రాతా!" ౭౯౦

వ॥ అని ప్రార్థించుటయు సూర్యభగవానుం డిట్లనియె. ౭౯౧

ఆ॥ "ఎంతయుం బ్రశస్త మీ మాఘశుక్లసప్తమి మదీయవాసరమునఁ గూడి
యుట్టిదినమునందు నే నుదయించుచో నిందుమునుఁగువాఁడు పొందు శుభము.

తే॥ సామయుండైన నగును నిరామయుండు. నిరామయుండైనఁ బడయు నిష్టార్థములను
మొగి నిహాముత్రఫలభోగమున విరాగి యచట స్నాతుండుగా మోక్షమే ఘటించు."

వ॥ అనియిట్లు కీర్తించి యర్ఘ్యముం డంతర్ధానంబుఁ జెందుటయు ధన్వంతరి సంత సించి స్వస్థానంబునకుఁ జనియె. నంతఁ గొంత కాలంబునకు ౭౯౨

సీ॥ శ్రీమదయోధ్యాపురీపరిపాలకుం డుష్ణరశ్మ్యన్వవాయోద్భవుఁడు
నడిగిన లేదననటువంటి నెఱదాత కృతమువకుం బ్రతికృతిఁ దాత
యర్థదేహములఁగాక యన్యులఁ గన్నెత్తియైనఁ జూడని ధీరుఁ డధికశూరుఁ
డత్యంత తేజస్వి యరినిషూదనుఁడునౌ రత్నాఢ్యుఁడను మేటిరాజొకండు
పూర్వకర్మవశత భూరికుష్ఠవ్యాధి కగ్గమగుచు దాని నపనయింపఁ
దిరిగె ముజ్జగములఁ. జేసె నౌషధంబులు-దానములను దనిపె ధరణిసురుల ౭౯౩

వ॥ కాని యెన్ని చేసినను నెక్కువయై యాబాధ్య మతని క్షీణింపఁజేయుటయు విరక్తుఁడై రాజ్యభారంబు పుత్రుపైఁ బెట్టి చెప్పవలసినబుద్ధులు సెప్పి స్నేహితుల కప్ప గించి దేవతలం బూజించి భార్యలను బంధువులను జెలికాండ్రను సేవకులును వలదు వలదని వారించుచున్నను వినక యగ్నిం బ్రవేశింపనున్న సమయమం దొక దివ్యతేజస్వి బుబంబు కాశికావడిం గైసేసికొం చరుగుదెంచి యత్యంతవిషాదమందున్న యాపురంబు [illegible] ౭౯౪

క॥ "పెద్దలుఁ బిన్నలుఁగూడం దద్దయు వాపోవ మూదమదక్కి యనూశా
పద్దళనున్నది యీపుర. మెద్దియొకత మిటులనునికి కెఱుఁగం జెపుమా." ౬౯౭

వ॥ అనియడుగుటయు నతం డిట్లనియె. ౬౯౮

ఆ॥ "ఈపురమేలునట్టిదొర యెంతయుఁ గుష్ఠముతోడ సంయుతుం
డై పడలేక బాధ జ్వలదగ్నిఁ బ్రవేశము సేయనున్నవాఁ
డో పథికా! యతండు సుగుణోదధి యట్టిని వీడియుండలే
కీపగిదిన్ జనంబు తపియించెడిఁ. జెల్లుటనిక్కమందముల్." ౬౯౯

వ॥ అనినవిని యాకార్పటికుండు త్వరితంబ రాజుఁబాలికిం జని. ౭౦౦

చ॥ "నృప! సకలామయంబులను నిర్వృతిసేసెడి తీర్థముండఁగా
నిపు డొక కుష్ఠజాడ్యమున కెంతయుఁ జింతిలి పావకంబునన్
వపువు దహింపఁజేయకుము. నాయొడలున్ భవదంగమట్లెకా
నపుడటు స్నానముఁజసలిపి యైతినిటు ల్మరటి దివ్యదేహుఁడన్. ౭౦౧

తే॥ సప్తమీభానువారము సవితృనుదయమందుఁ బోయి యజాగ్రస్తుఁ డచట స్నాన
మాచరించిన నీరోగుఁడగును నపుడ. యట్లు పాపవినిర్ముక్తుఁ డగును మతియు"

వ॥ అనిచెప్పుటయు రాజిట్లనియె. ౭౦౩

సావిత్రి॥ "ఏదేశంబందుండెం దాదృక్తీర్థశ్రేష్ఠం.
బోదివ్యాంగా! నాకీ వాదేశంబి మ్మయ్యా" ౭౦౪

వ॥ అనియడుగుటయు మతియు నాకార్పటికుండు. ౭౦౫

చ॥ "కలదిల నాగరాఖ్యఁ గడు ఖ్యాతము క్షేత్రము. కుష్ఠరోగసం
కలితుఁడనై తదంతర మొకానొక కాలమునందుఁ దీర్థయా
త్రల నొనరించుచుం జనుచుఁ దత్స్థలవర్తి తపస్వియొక్కఁ డి
బ్బలురుజవొందె కుండునను బాగుగఁజూచి కృపావిశిష్టుఁడై. ౭౦౬

ఆ॥ 'జలములనుశయించు చక్రికిఁ బశ్చిమోత్తరదిశం జెలంగుఁ గరముపుణ్య
మైన తీర్థమొకటి యనఘవిశ్వామిత్రమునివినిర్మితంబు మోక్షదంబు. ౭౦౭

ఆ॥ చనుము మాఘశుక్లసప్తమీభానువాసరమునందునీవు సరిగ నటకుఁ
జని యినోదయమున స్నానంబుగావింపు. నీదుకుష్ఠజాడ్యమేదునంత' ౭౦౮

చ॥ అనవిని యాదివారయుతమాఘల సప్తమి నేను దత్స్థలం
బున కతిభక్తితోడఁ జని పుణ్యతమంబగు తద్హ్రదంబునన్
మునిఁగి వినిర్గతుండనయి మూర్తి కనుంగొన నిద్భశంబుగన్
గనఁబడిరొక్క. యథార్థమును క్ష్మాపరిపాలక! నీకుఁ జెప్పితిన్. ౭౦౯

ఆ॥ అట్లుగాన నీవు నరిగి యాసప్తమీభానువాసరంపు భాస్కరోద
యమున నచటఁ దీర్థమాడుము. నీవ్యాధియడఁగుఁ. బాతకంబు నంతమొందు "

వ॥ అనినవిని యాక్షణంబ రత్నాఢ్యుఁ డాకాశి కావడివాని వెంటం జని మాఘశుద్ధ సప్తమీభానువాసరంబున విశ్వామిత్రతీర్థమందుఁ గృతావగాహుండై కుష్ఠంబున విడువం బడి సంతసంబునం బొంగుచుఁ గార్పటికునకు మూఁడుకోట్లమాడలర్పించి,

ఉ॥ త్సాహము —"భవదనుగ్రహమునఁజేసి భయదమ్మైనయట్టియీ
తెవులువోయెఁగానఁ బొమ్ము తీర్థవాహ! నేనిటఁ
దవిలి తపము సేసికొందు దారతోడఁగూడి-యి
య్యవనికిఁక విభుండు తనయుఁ. డతఁడు దక్షుఁ డోమఁగన్." ౨౧౭

వ॥ అనివచించి యాయనను సేవకులను నిండ్లకుఁబనిచి యాశ్రమంబుగట్టించికొని కళత్రసహితంబుగా నచట వసించి సిద్ధిం బొందె నతనిపేరవెలసినతీర్థంబు సర్వవ్యాధి హారంబును సకలపాతకనాశకంబును నయ్యె. దేవదేవుఁడగు దివాకరుం డతనిచే నటఁ బ్రతిష్ఠితుండై రత్నాదిత్యనామంబునఁ బ్రసిద్ధికివచ్చె. సప్తమీభానువాసరంబునం దాతీర్థంబునం గ్రుంకి యయ్యాదిత్యు దర్శించినఁ బాపంబులనుండి తొలఁగి సూర్య లోకంబునకుఁ జను. మఱియొక క్షేత్రం బచట వర్తిల్లెడి. తత్ప్రదేశంబున గ్రామ్యుం డగు నొకజనుండు కుష్ఠరోగంబున బాధపడుచుండియుఁ బశువులంగాచి జీవించుచు నొకనాఁడు కొండక్రిందిభాగమం దప్పసులమేపుచుండ నందొక్కటి తృణలోభంబున యూథంబువిడిచి చని సప్తమీరవివాసరంబున నమ్మడుఁగునం బడుటయు నదియెఱుంగక వాఁడు తక్కుపసులం దోలుకొని సాయంసమయమం దింటికిఁజనఁ దృదశుస్వామి వానిపాలికింబోయి గద్దించుచు

కం॥ "రాలే లేలర ఖల! యీవేళను మా పాడియావు వేశ్మంబునకున్
దోలుకొనిరమ్ము. వానిని మాలోఁగిలిఁ జేర్పకున్న మననీ నిఁకనిన్ " ౨౧౮

వ॥ అనినవిని వాఁడు భయపడి యాక్షణము పగలది తిరిగిన మార్గంబువట్టిపోయి రాత్రివేళయగుట గాఢాంధకారంబునఁ బెనుగోతింబడి కొట్టుకొనుచున్న దాని యఱపు దూరమున వినరా నందు దూఁకి పంకంబునుండి పైకిలాగి మెలమెల్ల నతనియింటికిం దోలుకొనిపోయి యప్పగించి స్వగృహంబునకుఁజని పండుకొని తెల్లవారినపిదప లేచి స్వశరీరంబుఁ జూచుకొని కుష్ఠవినిర్ముక్తమై మంచిచాయనుండుట కాశ్చర్యపడి

కం॥ "ఏమిది యాకస్మికముగ నామయ మెడలినది నిశ్చయంబుగ నిది వి
శ్వామిత్రతీర్థమహిమయ. నే మునిఁగితి దానఁ బశువు నెమకుచు రాత్రిన్. ౨౧౯

వ॥ అనివిచారించి యపగతకందూతియై యధికతేజంబునం బొదలు నప్పుడువాలఖిల్యుండు మరల నాతీర్థంబున కరిగి యయ్యటవీమధ్యస్థితుండగు నాదిత్యు ధ్యానించుచు నందుఁ దపంబుండి పరమసిద్ధిం బ్రాపించెఁ. గాన సర్వప్రయత్నములచేతను నందుఁ దీర్థమాడి భాస్కరుం బూజించునది. యిక్కలికాలంబునఁ గూడ సప్తమీభానువాసరంబునఁ దత్పుణ్యతీర్థజలస్నానంబున శుచియై యెవ్వఁ డాదేవు భక్తిచేఁ బూజించు వాఁడు విముక్తపాతకుండగుఁ. దదగ్రంబునం గూరుచుండి యెనిమిదివేలగాయత్రీమంత్రంబు జపించిన నీరోగుండును నిష్కల్మషుండును నగుఁ దదుద్దేశంబుతో శ్రద్ధమై నెవ్వఁడు గోదానంబొనరించు వానివంశజుఁడు సహితము వ్యాధిచే స్పృశింపఁబడఁడు. కుష్ఠవ్యాధిచేఁ గుమిలికుమిలి పూర్వ మొకభూసురుం డందు గక్తచందనంబున నాదిత్యప్రతిమ యమర్చి యర్చించుటయు వేయియేండ్లకు దేవుండు ప్రీతుండై దర్శనంబిచ్చి వరంబడుగుమన నతం డిట్లనియె. ౨౧౭

తే॥ "సంతసించితి వేని యోసవిత! నాదు కుష్ఠరోగము హరియించి కూర్పుమయ్య
యట్లు కాకుండ స్వర్గరాజ్యము నిడినను మన్మనఃప్రీతి సేయ. దీమాట నిజము" ౨౧౮

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు సూర్యభగవానుండు ౨౧౯

తే॥ "సప్తమీభానువారము సరిగ నీవు పావనహ్రదమున నాడి పండ్లు చేతఁ
బట్టుకొని నూటయెనుబదిపరులు నాకు వలగొనుము కుష్ఠజాడ్యంబు వదలిపోవు

కం॥ భూతలగతుఁ డెవ్వఁడైనను నేతద్వ్రతముం జరింప నెల్లగదంబుల్
ధూతంబులగును వానికి. నాతర్వాతను లభించు నస్మత్పదమున్." ౨౨౧

వ॥ అనినవిని యాబ్రాహ్మణుం డట్లాచరించి నష్టకుష్ఠుండును నవ్యకాంతియుతుండును నయ్యెఁ. నట్టియాతని నవలోకించి వెండియు సూర్యభగవానుండు
పంక్తి॥ "ఏమిప్రియంబు న్నేమటిచేతున్ నీమతమేదయ్యా మహిదేవా!" ౨౨౨

వ॥ అనిప్రశ్నించుటయు బ్రాహ్మణుం డిట్లనియె. ౨౨౩

పంక్తి॥ "ఎప్పటికిన్నీ విప్పదమందే తప్పకయుండన్ మెప్పగుదేవా!"

వ॥ అనియిట్లునొడువుటయు మరల సూర్యభగవానుండు ౨౨౪

మధుమతి॥ "మహీసురేంద్ర! యిఁకన్ రహిఁవసింతు విటన్.
గుహారవానుఁడు నా విహితసంజ్ఞుఁడవై." ౨౨౬

వ॥ అని తదిష్టవరంబిచ్చి యంతర్ధానంబునొందె. నంతఁ గొంతకాలంబునకు శ్రీకృష్ణుండు సాంబునిగనుటయు నతఁడు రాజమార్గంబునఁ జనుచోఁ బురస్త్రీలు మోహించి గవాక్షంబులెక్కి కాంచుచుండెడివారు. ౨౨౭

## —• సాంబోపాఖ్యానము •—

సీ॥ సగము లందినయట్టి మృగమదంబులతోన పరువెత్తిపోయెడి దరుణియొక్క
యొకకంటి కిడిన మేల్తళుకుఁగాటుకతోన వడివడి నడతెంచుఁ బడఁతియొక్క
కలయ మువ్వనియట్టి తలవెండ్రుకలతోన వేవేగ నరుదెంచు వెలఁదియొక్క
స్తన్యమిచ్చుచుఁగూడ సంత్యక్తబాలయై శీఘ్రంబ చనుదెంచుఁ జెలియయొక్క
యొక్కకాలి నుపానహ మెక్కఁదొడిగి తక్కుకాలునఁ బాదుకం ద్రొక్కుకొనుచు
జనును దొరతొర నొక్కర్తుక చంటిబిడ్డ లేడ్వ నత్తలు మామ లెంతేని యఱవ.

సీ॥ కదలక మెదలక యొక్కర్తుక నిలుచుండుఁ జిత్రంబునందలి స్త్రీవిధమున
నేఁడినిట్టూర్పులు విడుచు నొక్కర్తుక బుసకొట్టుచును బిట్టు భుజగమట్లు.
పడు గవాక్షమునుండి పడఁతి యొక్కర్తుక క్షితిమీఁద నెంతయుం జేష్టలుడిగి.
చెప్పు నొకర్తుక చెలికత్తెతోడ నాతనిఁగూడినదియె తా ధన్యయనుచు.
నట్లు నవమన్మథాకారుఁడైన సాంబు రూపరేఖావిలాసంబు లాపురాంగ
నలు గనుంగొని మోహ మగ్గలముగాఁగఁ బరవశతఁజెంది రోనిరాబారులార !

సీ॥ పీతాంబరునిచేతఁ బెండ్లాడఁబడి సపత్నీమాతలైనట్టి కామినులును
నద్వారియందు శ్రీహరివలనం గల్గి యక్కసెల్లెండ్రైన యంగనలును
నన్నదమ్ములచేత నగ్నిసాక్షికముగాఁ బరిణీతలైనట్టి భామినులును
గులగురులైనట్టి కుంభినీదేవుల పాణిగృహీతలౌ పతివ్రతలును
మోహ మూఁగలేక యాహాయటంచు నాయదుకుమారుఁజూడ నరుగుచుండి.
రదియటుండనిండు. పెదపెద్దలౌ పూరుషులె భ్రమించి రతనిఁ జూచి మిగుల. ౨౩౦

వ॥ అట్లు భ్రమించి వికాసపడువారును నర్థాపేక్షలేకయే యతని సేవింపనెంచు వారును నతనియాననంబు నవలోకింపఁగోరువారును సౌందర్యంబు వర్ణించువారును నై వర్తించుచుండిరి. అంతఁ గొంతవడికి క్షపాసమయంబున నందినియను నతని సవతితల్లి తత్పత్నీవేషంబు చేసికొని తచ్ఛయ్యాంబ బరుండియుండుటయు నతండు రతిక్రియలం బరితృప్తినొంది తచ్చేష్టితంబు లనుమానాస్పదంబులుగా ౨౩౧

తే॥ "నాదుప్రాణాలకన్న నెంతయుఁ బ్రియయగు నంగరాజతనూజ యీయదియె యింగు
తతిచమత్కృతు లెఱుఁగ. దౌర! గణికలకు నిట్టి రతిచాకచక్యంబు పట్టువడదు"

వ॥ అని వితర్కించి దీపంబు దెచ్చి విలోకించి నందినిఁగాఁ దెలిసికొని ౨౩౩